# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

Friday, May 4, 2012

## స్క్రీన్‌ప్లే ఉపకరణాలు : స్క్రీన్‌డ్రామా



**స్క్రీన్‌డ్రామా :** కథని మనం దృశ్యమాధ్యమంలో చూపిస్తున్నాం కనుక పాత్రల చర్యలని దృశ్య రూపంలో ఏవిధంగా మలచాలి అనే అంశంపై మన దృష్టి కేంద్రీకరించాలి. అప్పుడే మన మాధ్యమానికి మనం న్యాయం చేసిన వారం అవుతాము. ఒక దృశ్యం వెయ్యిపదాలకి సమానం అనే లోకోక్తిలో ఎంతో అర్ధం వుంది.

దృశ్య మాధ్యమానికి రాయడం అంటే "బస్టాప్‌లో ప్రయాణికులున్నారు, బస్ వచ్చింది. అప్పటిదాకా బస్ కోసం చూచిన పుల్లయ్య బస్ ఎక్కాడు. కండెక్టర్ వచ్చి టికెట్ కొట్టాడు. బస్ వెళ్లిపోయింది. ఫేడ్ ఔట్ -!!!??. చూచేవాడికి ఆసక్తి అసంకల్పితంగా కలగదు. ప్రేక్షకుడికి ఆసక్తి కలిగించాల్సిన బాధ్యత కథకుడిది, దర్శకుడిది. సినిమా దర్శకుడిగా అతని మొదటి ప్రాధాన్యత దృశ్యం, అత్యంత అల్పమైన అతని రెండో ప్రాధాన్యతగా సంభాషణనే చెప్పాలి. దృశ్యాల్లో కథ చెప్పాలంటే కేవలం మెదడు ఉపయోగిస్తే చాలదు, దానికి హృదయం కావాలి. సంభాషణపై ఆధారపడటం అనేది ఒక వ్యసనం లాంటిది. ఏదో చూపిస్తామని చెప్పి పిలిచిన ప్రేక్షకుడికి - అతని కంటికి కాక చెవికి పని కల్పించడం ఎంతవరకూ సమంజసం?

సినిమా అనేది దృశ్యమాలిక. దృశ్యం(Shot) తరువాత దృశ్యం మారుతుండగా కథ ముందుకు నడుస్తుంది. దీన్నే కథ అభివృద్ధి చెందడం అంటాం. సంభాషణతో నడిచే కథల్ని గమనించండి అవి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు ఉన్న చోటు నుండి కదలకుండా పడివుంటాయి. పాత్రల చర్యల్ని దృశ్యరూపంలోకి మార్చడమే స్క్రీన్‌డ్రామా అన్నాం దృశ్యరూపంలో రాయడం అంటే ఏమిటో చూద్దాం. ** చర్య ప్రత్యేకమైన ఉపకరణం కాబట్టి సందర్భాన్ని బట్టి చర్చిద్దాం.

ఉదా: 1.బస్‌స్టాప్ ఉదాహరణలో కూడా సంభాషణ ఎక్కడా లేదు. ఐనప్పటికీ అది దృశ్యరూపంలో కూర్చిన సన్నివేశంగా అంగీకరించలేము.
2.అతని హృదయంలో అగ్ని పర్వతం బద్దలైంది. కోపం లావాలా ఉప్పొంగింది. వర్ణనలు నవలా ప్రక్రియలు.
3.దూరంగా వున్న జనాలకి వినపడేలా పెద్దగా సంభాషణలు పలుకుతూ ఆకర్షించడం నాటక ప్రక్రియ.

**Blog Archive**



**About Me**



Aaditya Chowdary Mulpuri

Those that know do,Those that understand teach.

View my complete profile

**My Blog List**

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్ధ సద్గురు శ్రీ శిరిడీ సాయినాధ మహారాజ్ కీ జై - ఓం శ్రీ సమర్ధ సద్గురు సాయినాధాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...

*2 years ago*

ప్రకృతి & సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని

మరి దృశ్యం అంటే ఏమిటి? దృశ్యం ప్రాధాన్యత ఏమిటి?

బస్‌స్టాప్ ఉదాహరణనే తీసుకుందాం. ఇది చూడటం ద్వారా మనలో ఎలాంటి స్పందన కలగడం లేదు. బస్ వచ్చింది ఎక్కి కూర్చోవటంలో అర్థం వుంది కానీ సినిమా కథని మనం చూస్తున్నప్పుడు ఈ సన్నివేశం ఇక్కడెందుకుంది? ఇక్కడితను ఏం చేస్తున్నాడు? తర్వాత ఏక్కడికి వెళ్తాడు లాంటి ఎన్నో ప్రశ్నలు మనసులో మెదులుతూవుంటాయి. అంటే చూస్తున్నప్పుడు మనం ప్రస్తుత సన్నివేశానికి, తరువాత జరగబోయే సన్నివేశానికి మధ్యనున్న సంబంధాన్ని తెలుసుకోగోరుతున్నాం. అంటే సన్నివేశం ద్వారా మనకేం తెలియాలి?

1.మనలో ఏదైనా స్పందన కలగాలి లేదా కనీసం

(ఇక్కడ స్పందన అంటే ఆ సన్నివేశం ఏ రస ప్రధానంగా రాసామో ఆ రసస్పందన  ప్రేక్షకుడిలో కలగాలని భావం)

2.మనం చూస్తున్న సన్నివేశంలో కథకి గానీ లేదా పాత్రకి గానీ సంబంధించిన సమాచారం వుండాలి దానితో పాటుగా,

3.ప్రస్తుతం చూస్తున్న సన్నివేశానికి ముందు, దాని తర్వాత వచ్చే సన్నివేశాలకి ఏదో ఒక సంబంధం వుండి తీరాలి.

**కథని షాట్స్ ద్వారా చెబుతున్నాం కాబట్టి రాస్తున్న స్క్రిప్ట్‌లోని పదాలు షాట్స్ రూపొందించడానికి అనుగుణంగా వుండాలి. మరిన్ని వివరాలు సన్నివేశం, సంభాషణ అనే ఉపకరణాల గురించి చర్చించేప్పుడు తెలుసుకుందాం.

కథని కెమెరాతో చిత్రీకరించి ఆ తర్వాత ఎడిట్ చెయ్యడం జరుగుతుంది. కనుక ఛాయాగ్రహణం, కూర్పు అనే ఈ రెండు కళలు పరస్పర ఆధారితాలు. ఎడిటింగ్ అనే కళకి సంబంధించి కథని చెప్పడానికి ఎన్నో మెలకువలున్నాయి.

ఉదా : కొంత సమయం గడిచింది అని చెప్పడానికి ఉపయోగించే Dissolve.
చాలా కాలం గడిచింది అని చెప్పడానికి ఉపయోగించే Fade out.
వీటిని Transitions అంటారు. Montage Sequence, Transitions, Continuity Editing & Dynamic Editing వంటి అంశాలపై అవగాహన పెంచుకోవాలి.

ఛాయాగ్రాహకునితో దర్శకుడు సంభాషించడానికి ప్రత్యేకమైన పదజాలం వుంది. విజువల్‌గా కథని చెప్పాలనుకున్నప్పుడు ఆ సాంకేతిక పదజాలం పట్ల కథకుడికి కనీస అవగాహన ఎంతో అవసరం. Shots, Angles, Compositions, Continuity, Cutting, Lenses, Filters, Colour Schemes పట్ల అవగాహన ఎంతో అవసరం.

ఈ క్రింది సన్నివేశం చూడగానే మీకు దృశ్యరూపంలో కథ చెప్పడం ప్రాముఖ్యత  అర్థం అవుతుంది.

link 1
http://www.youtube.com/watch?v=doRuRMO2rAs

(ఇది మూకీ సినిమా అనుకోకండి)

- ఆదిత్య చౌదరి.మూల్పూరి
(greenlong2498@gmail.com)

Posted by Aaditya Chowdary Mulpuri at 1:15 AM 

Recommend this on Google

## 2 comments:

**Sudha** May 4, 2012 at 5:12 PM

తెలీదు.. నిదుర లేచాక స్వప్న...
*1 year ago*

**ప్రణుతి**



12.దత్తావధూత సమర్ధ సద్గురు నాయుడు స్వామి మహరాజ్ (లక్ష్మీ పురం, కర్నూలు జిల్లా) - నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః మహాముని మౌన ప్రభోదాకృత దక్షిణామూర్తి వేదవేదాం...
*6 months ago*

**భక్తి & భగవంతుడు**



3/A.భగవంతుడు (ఆధ్యాత్మికం) - విఘ్నేశ్వరునికి - సరస్వతి మాతకి నమస్కారం - శ్రీ గురుభ్యో నమః గురుదేవులు సమర్ధ సద్గురు సాయినాధ మహరాజుకి, దత్తావధూత సమర్ధ సద్గురు నాయుడు స్వామి మహ...
*4 months ago*

**భాష & భావన**



స్పందన - శాంతి, స్వచ్ఛత, అణకువ, విధేయత ఇస్లాం పదానికి అర్థం అరబిక్ పదం సలేమా నుండి పుట్టిందిది... నువ్వెక్కడ పుట్టావు.. ఎక్కడ పెరిగావు.. నీ మూలమేది.. ఈ దేశం తిండి...
*4 months ago*

**సాహితీ వనం**



భావన - యుగాలు క్షణాలై కాలం గతించిపోనీ, నేను నీవను భావన, నీలో కరిగిపోనీ. - మూల్పూరి. ఆదిత...
*1 year ago*



**Followers**

Join this site
with Google Friend Connect

**Members (3)**



Already a member? Sign in





సన్నివేశం ద్వారా మనకేం తెలియాలి అంటూ ప్రశ్నించి మీరిచ్చిన సమాధానం, టాకీ సినిమాయే అయినా మూకీలా మాటలు లేకుండా తీసిన పుష్పక విమానం సన్నివేశానికి బాగా అతికింది.ప్రేక్షకుడిలో స్పందన కలగడం, సన్నివేశానికి ముందు గానీ వెనక గానీ జరిగే కథకి సంబంధం ఉండడంగానీ. మీ వ్యాసంలో విషయాలు మీరిచ్చిన లింక్ ల ద్వారా బాగా అర్థమయ్యాయి. ధన్యవాదాలు.

Reply Delete



ఆదిత్య చౌదరి.మూల్పూరి May 10, 2012 at 9:29 PM

thnx sudha garu

Reply Delete

Enter your comment...

**Comment as:** Aaditya Chowdary Mulpuri (Google) Sign out

Publish Preview Subscribe by email

## Links to this post

Create a Link

Newer Post Home Older Post

Subscribe to: Post Comments (Atom)

**haram**




**kudali**




**Total Pageviews**



**2,529**

**cc**

